# శ్రీజగన్నాథాష్టకము.

ఇది పతితపావనుఁడని సుప్రసిద్ధుఁడగు
శ్రీజగన్నాథస్వామిని గూర్చినదియగు
టను పఠించువారల సకలపాపములను
పోఁగొట్టునదిగాన
శ్రీ పరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి
అయ్యవారలుఁగారిచే
రచియింపఁబడినటీకతోఁ జే
ర్చఁబడి
మ॥ రా॥ రా॥ శ్రీ అంకితం వెంకటజగ్గారావు
రాజాగారి అభిప్రాయమనుసరించిన
చిక్కం రామచంద్రయ్యనాయుడుగారి సెలవు
ప్రకారము స్త్రీబాలవృద్ధులకు స్పష్టముగాఁ ద
లియుటకు గొడవర్తి వెంకటజగన్నాథాచా
ర్యులుగారిచేత విశాఖపట్టణమునందలి
ఆర్షముద్రాశాలయందు
ప్రచురపఁబడినది.

ప్రింటర్ డా॥ గురన్న.
ఆర్షముద్రాశాల.
విశాఖపట్టణము
1892.

# శ్రీజగన్నాథాష్టకమ్



కదాచి త్కాళిన్దీతట నటన సఙ్గీతకపరో
ముదాభీరీ నారీవదన కమలాస్వాదమధుపః।
రమాశమ్భుబ్రహ్మామరపతిగణేశార్చితపదో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥౧॥

భుజే సవ్యే వేణుం శిరసి శిఖిపిఞ్ఛం కటితటే
దుకూలే నేత్రాంతే సహచరికటాక్షంచ దధతే।
సదా శ్రీమద్బృన్దావనవసతిలీలాపరిచయో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥౨॥

# శ్రీజగన్నాథాష్టకటీక



౧ కదాచిత్ ముదా కాళిన్దీతటవిపినసంగీతకపరః= ఒకానొకప్పుడు సంతోషముచేత యమునానదియొడ్డుననుండెడియరణ్యమునసంగీతముపాడుటయందాసక్తిగలవాఁడును, ఆభీరీనారీవదనకమలాస్వాదమధుపః= గోపాలస్త్రీలముఖములనెడిపద్మములను రుచిచూచుటకు తుమ్మెదయైనవాఁడును, రమాశమ్భుబ్రహ్మామరపతిగణేశార్చితపదః = లక్ష్మీదేవి శివుఁడు బ్రహ్మ ఇంద్రుఁడు విఘ్నేశ్వరుఁడు వీరలచేతఁబూజింపఁబడిన పాదములుగలవాఁడునగు, జగన్నాథస్వామీ మే నయనపథగామీ భవతు= జగన్నాథస్వామి నా నేత్రమార్గమునసంచరించువాఁడు కావలయును.

౨ సవ్యే భుజే వేణుమ్= ఎడమ చేతను పిల్లనగ్రోవిని, శిరసి శిఖిపిఞ్ఛమ్= శిరస్సున నెమలికుచ్చునను, కటితటే దుకూలే= నడుమున వెలిపట్టువస్త్రములనును, నేత్రాన్తే సహచరికటాక్షంచ దధతే = క్రేగంటియందు చెలికత్తెలనుగూర్చినచూపునును ధరింపుచున్నవాఁడును, సదా శ్రీమద్బృందా

మహాంభోధే స్తీరే కనకరుచిరే నీలశిఖరే
వసన్ ప్రాసాదాన్త స్సహజ బలభద్రస్య బలినః।
సుభద్రాయామధ్యే సకలసురసేవాఽవసరదో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥౩॥

కృపాపారావార స్సజలజలదశ్రేణిరుచిరో
రమావాసోరామస్ఫురదమలపద్మోద్భవముఖైః।

వనవసతిలీలాపరిచయః జగన్నాథస్వామీ = ఎల్ల ప్పుడును శోభతోఁగూడినబృందావనమున నివసిం చుట యనెడి లీలయందు పరిచయము గలవాఁడు న గు జగన్నాథస్వామి, మే నయనపథగామీ భవ తు = నాయొక్క నేత్రమార్గమునసంచరించువాఁ డు కావలయును.

౩ మహాంభోధేః తీరే = మహాసముద్రము యొక్క ఒడ్డున, కనకరుచిరే నీలశిఖరే ప్రా సాదాన్తః = బంగారముచేత మనోహరమైన నీ లాద్రియొక్క శిఖరమున గుడిలోపలను, బలినః సహజబలభద్రస్య సుభద్రాయాశ్చ మధ్యే వస న్ = బలవంతుఁడై తోడఁబుట్టినవాఁడగు బలరా మునకును సుభద్రాదేవికిని నడుమను ఉన్నవాఁడు. ను, సకలసురసేవావసరదః జగన్నాథస్వామీ = అందఱు దేవతలకును సేవించుటకొఱకైనసమయ మునిచ్చువాఁడునగు జగన్నాథస్వామి, మే నయన పథగామీ భవతు = నా నేత్రమార్గమున సంచరిం చువాఁడు కావలయును.

౪ కృపాపారావారః సజలజలదశ్రేణిరుచి రః రమావాసః రామః = దయాసముద్రుఁడును నీటితోఁగూడిన మేఘపంక్తివలె సుందరమైనవాఁడు

సురేన్ద్రైరారాధ్య శ్రుతిగణశిఖాగీతచరితో
జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే॥౪॥

రథారూఢో గచ్ఛ న్పథి మిళితభూదేవపటల
స్తుతిప్రాదుర్భావం ప్రతిపద ముపాకర్ణ్య సదయః॥
దయాసిన్ధు ర్బన్ధు స్సకలజగతాం సింధుసుతయా
జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే॥౫॥

ను అనఁగా కారుకొనియున్న మేఘమువలె నల్లగా నుండువాఁడును లక్ష్మీదేవికి నివాసస్థానమైనవాఁడును అందఱిని సంతోషపెట్టువాఁడును, స్ఫురదమలపద్మోద్భవముఖైః సురేంద్రైః ఆరాధ్యః = వికసింపుచున్నదియునిదోషమైనదియునగుపద్మమునం బుట్టినబ్రహ్మ మొదలగు దేవశ్రేష్ఠులచేత ఆరాధింపఁబడువాఁడును, శ్రుతిగణశిఖాగీతచరితః జగన్నాథస్వామీ మే నయనపథగామీ భవతు = వేదసమూహములచివరలయందు అనఁగా వేదాంతములయందు తెలియఁజేయఁబడిననడవడికగలవాఁడునగు జగన్నాథస్వామి నాయొక్క నేత్రమార్గమునసంచరించువాఁడు కావలయును.

౫ రథారూఢః గచ్ఛన్ = రథమునెక్కినవాఁడై వెడలుచు, పథి మిళితభూదేవపటలస్తుతి ప్రాదుర్భావం ప్రతిపదమ్ ఉపాకర్ణ్య సదయః = మార్గమున గుంపుగూడినబ్రాహ్మణసమూహముయొక్క స్తోత్రారంభమును మాటిమాటికిని విని దయగలవాఁడుగానున్నవాఁడును, దయాసిన్ధుః సకలజగతాం బన్ధుః జగన్నాథస్వామీ = దయాసముద్రుఁడును అన్నిలోకములలోనివారికిని బంధువునగు జగన్నాథస్వామి, సింధుసుతయా (సహా) మే నయన

పరంబ్రహ్మా పీడ్యః కువలయదళోత్ఫుల్లనయనో
నివాసీనీలాద్రౌనిహిత చరణోనంతశిరసి।
సదానందో రాధాసరసవపురాలింగనసుఖో
జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే॥౬॥

నవైప్రార్థ్యంరాజ్యంనసకనకతాంభోగవిభవం
నయాచేహంరమ్యాంనిఖిలజనకామ్యాంవరవధూం।
సదాకాలేకాలే ప్రమథపతినాగీతచరితో
జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే॥౭॥

పథగామీ భవతు = సముద్రమునకుఁగూతురగు శ్రీమహాలక్ష్మితోఁ (గూడ) నాయొక్క నేత్రమార్గమున సంచరించువాఁడు కావలయును.

౬ పరంబ్రహ్మాపి ఈడ్యః = పరబ్రహ్మమైనను స్తోత్రము చేయఁదగినవాఁడును, కువలయదళోత్ఫుల్లనయనః — కలవరేకులవలె వికసించియున్న నేత్రములుగలవాఁడును, నీలాద్రౌ నివాసీ అనంతశిరసి నిహితచరణః = నీలాద్రియందు నివసించుచున్నవాఁడును ఆదిశేషునిశిరస్సునందు ఉంచబడినపాదములుగలవాఁడును, సదానందః రాధా సరసవపురాలింగనసుఖః జగన్నాథస్వామీ — ఎల్లప్పుడును ఆనందముతోఁగూడియున్నవాఁడును రాధయొక్క సరసమైన శరీరమును కౌఁగిలించికొనుటచేఁగలిగిన సుఖముగలవాఁడునగు జగన్నాథస్వామి, మే నయనపథగామీ భవతు — నా నేత్రమార్గమున సంచరించువాఁడు అగుఁగాత.

౭ రాజ్యం న ప్రార్థ్యేఽహం వై = రాజ్యము ప్రార్థింపఁదగినది కాదుగదా — సకనకతాం నయాచె — బంగారుకలిగియుండుటను యాచింపను — భోగవిభవం నయాచె — భోగములవైభవమును యాచింపను — అహం రమ్యాం నిఖిలజనకామ్యాం వర

హరత్వం సంసారం ద్రుతతరమసారం సురపతే
హరత్వం పాపానాం వితతిమపరాం యాదవపతే।
అహో దీనస్వార్థం విహితవచసో నిశ్చితపదో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥౮॥

వధూనాం నయనా చే- నేమ రమ్యముగానుండు నదియు అందుజనుల చేఁగోరఁదగినదియునగు మంచి(స్త్రీ)ని కోరను- ప్రమథపతినా గీతచరితః జగన్నాథస్వామీ- ప్రమథగణములకధిపతియగుశివునిచేత గానము చేయఁబడినచరిత్రముగల జగన్నాథస్వామి, కాలే కాలే సదా మే నయనపథగామీ భవతు- ప్రతిస మయమునందును ఎల్లప్పుడును నాయొక్క నేత్ర మార్గమునసంచరించువాఁడు కావలయును.

౮ (హే) సురపతే! త్వమ్ అపారం సంసా రం ప్రమతతరం హర- (ఓ) దేవతలకుఁగూడ నేలిక యైనవాఁడా! నీవు సారములేని సంసారమును మిక్కిలిశీఘ్రముగా పోఁగొట్టుము- (హే) యాదవ పతే! త్వమ్ అపరాం పాపానాం వితతిం హ ర- (ఓ) యాదవశ్రేష్ఠుఁడా! నీవు మిగిలిన పాప ముల సమూహమును పోఁగొట్టుము- అహో! - ఆశ్చర్యము! జగన్నాథస్వామీ- జగన్నాథస్వామి, ఇత్థంవిహితవచసః నిశ్రితపదః దీనస్య మే- ఇ ట్లు చేయబడిన (నీ) స్తోత్రముగలవాఁడనును ఆశ్ర యింపఁబడిన(నీ)పాదములుగలవాఁడనును దీనుఁడ ననగు నాయొక్క, నయనపథగామీ భవతు- నే త్రమార్గమునసంచరించువాఁడు కావలయును.

త్రిసన్ధ్యం యస్తోత్రం పఠతి శృణుతే గాయతిపరం
పవిత్రం పాపఘ్నం సకలజగదీశాష్టక మిదమ్।
సధన్యః పుణ్యాత్మా సకలసుఖభోగీ చ భవతి
వ్రజ త్యన్తే విష్ణోః పరమపద మీశస్య పురుషః॥౯॥

శ్రీజగన్నాథాష్టకం సమాప్తి మగమత్.



౯. యః — ఎవ్వాఁడు, పవిత్రం పాపఘ్నం సక
లజగదీశాష్టకమ్ ఇదం స్తోత్రమ్ — పవిత్రమైనది
యును పాపములను పోఁగొట్టునదియునగు అన్ని
లోకములకు నధిపతియైనవానింగూర్చిన ఎనిమిదిశ్లో
కములైన (జగన్నాథాష్టకమనే) ఈ స్తోత్రమును,
పరం త్రిసన్ధ్యమ్ పఠతి శృణుతే గాయతి = మి
క్కిలిగా మూఁడుసంధ్యలయందును పఠించునో విను
నో పాడునో, సః పురుషః — ఆ పురుషుఁడు, ధ
న్యః పుణ్యాత్మా సకలసుఖభోగీచ భవతి — ధన్యుఁ
డును పుణ్యాత్ముఁడును అన్నిసుఖములననుభవిం
చువాఁడును అగును - అన్తే ఈశస్య విష్ణోః పరమ
పదం వ్రజతి — కొనను (మరణానంతరమున) ఈ
శ్వరుండగు విష్ణువుయొక్క వైకుంఠమును పొందు
చున్నాఁడు.

శ్రీజగన్నాథాష్టకము సమాప్తిని బొందెను.



